# జ్వరము

మదరాసు, 1929

Record no. 585

# Jvaramu

# Madarāsu, 1929

Record no. 585

## SUNDARAYYA VIGNANA KENDRAM

1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

### Bibliographic Record Target

జ్వరము.- మదరాసు : The Christian Literature Society for India, 1929.

8 p. ;12 cm.

Record no. 585

Jvaramu.- Madarāsu : The Christian Literature Society for India, 1929.

8 p. ;12 cm.

Record no. 585

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB Date filming began:

జ్ఞానమాంలిక 11] [Village Series 11

# జ్వరము

# FEVER







MADRAS
THE CHRISTIAN LITERATURE SOCIETY FOR INDIA
With which is amalgamated
THE MADRAS RELIGIOUS TRACT AND BOOK SOCIETY
*Price 1 Pie*] 1929 [2 E. 10 M.




# జ్వరము

## FEVER

ప్రతి మానవునికిని ఒకానొకప్పుడైనను జ్వరము రాక తప్పదు. వయస్సు వచ్చియున్న ప్రతివాడును జ్వరమువలన కలిగెడు బాధలను తన అనుభవమువలన గ్రహించియుండును. జ్వరము ఒక వ్యాధియని అనేకులు తలంచెదరు. గాని ఆలోచించి చూచిన అది ఒక వ్యాధికాదు. శరీరమందు ఏదో ఒక జబ్బు ఉండియుండవలెను. దానిని బయటికి వెళ్లగొట్టుటకు శరీరము యత్నించును. దానికొక గురుతుగా జ్వరమువచ్చును. జ్వరము వచ్చినపుడు దేహమందొక చెడుగు ప్రవేశించియున్నదని గ్రహింపవలెను. ఆ లోపలి జబ్బుపోతేనే తప్ప జ్వరము తగ్గిపోనేరదు.

అనేక కారణములవలన జ్వరము కనబడును. సామాన్యముగా పసితనమందు కడుపు మందముగా నున్నపుడు

జ్వరము వచ్చును. వర్షములోను చలిగాలిలోను లేక యెండలోను తిరుగుటవలన జ్వరమువచ్చును. విషాంకురములు (అనగా కంటికి కనబడనంతటి చిన్న విషపురుగులు) రక్తములో ప్రవేశించుటవలన జ్వరము కనబడును. పొంగు వచ్చు సమయమునను, మశూచికము కనబడునపుడును, మలేరియా యను చలి పుట్టినపుడును జ్వరము హెచ్చుగావచ్చును. సుమారు ఏడు సంవత్సరములకు ముందు ఇన్ ఫ్లూయెంజా అను జ్వరము లోకమంతా కనబడి అనేక లక్షల జనులను నశింపజేసెను.

సాధారణముగా జ్వరము కనబడినపుడు తలభారము, నడుమునొప్పి కీళ్లలో పోట్లు, వికారము, అన్నహితవు లేకపోవడము ఉండును. విషజ్వరములు అనుభవశాలులైన వైద్యులచేతనే కుదుర్చబడవలెను. విషజ్వరమని అనుమానము తట్టినయెడల వైద్యుని రప్పింపవలయును. సాధారణమగు జ్వరములకు ఇంటి వైద్యము పనికివచ్చును. జ్వరము రావడముతోడనే రోగిని మంచముమీద పరుండబెట్టుట అత్యవసరము. తిరుగుచున్నంతవరకు గుండె త్వరితముగా కొట్టుకొని ఉష్ణ మధికమగు



చుండును. పరుండుటవలన శరీరమునకు విశ్రాంతి కలుగును. మంచముమీద మెత్తని పక్క వేయుట మంచిది. పరుపులేనప్పుడు నాలుగైదు వరుసల బట్టలు మంచముమీద వేయవలెను. మంచము గాలి తగలని ప్రక్కను వేసి రోగిపైన ఒక బట్ట కప్పవలెను. కొన్ని సమయములయందు ఒంటిమీద బట్టలు లేనప్పుడు వేడి శరీరముమీద చల్లనిగాలి కొట్టినయెడల శీతలము కమ్మును. గనుక ఒక బట్ట రోగిమీద వేయుట చాలా మంచిది. రోగి పరుండిన గది చల్లగా నుండవలెను. తలుపులు మూసి యెండ, దుమ్ము, లోపలికి రాకుండ చూడవలెను. కిటికీలు తెరచి గాలి రానియ్యవలెనుగాని రోగిమీదమాత్రము గాలి తగలకూడదు. అయితే విసెనకర్రతో కొంచెము విసరవచ్చును. ఆ గది నిశ్శబ్దముగా నుండవలెను. రోగికి సహాయము చేయువారు తప్ప మరి యెవరును ఆ గదిలో ప్రవేశింపకూడదు. పిల్లలును ఇంటికి వచ్చెడివారును. ఆ గదిలోకి వెళ్లి మాట్లాడి శబ్దము చేయుటవలన రోగికి ఆయాసము కలుగును. రోగి యెంత నెమ్మదిగానుండునో అంతత్వరలో ఆరోగ్యము పొందును.

రోగి చిరాకుగా నుండును గనుక అన్నివిధముల సహా యముచేయ యత్నింపవలయును. రాత్రియందు దీపము వెలిగించిన రోగి కంటికెదురుగా నుంచక తలకు దూరముగా వెనుకతట్టు ఉంచవలయును. జ్వరము వచ్చి యున్నపుడు విరేచనములకు మొదట మందివ్వవలెను. ఆముదమువంటి మంచిమందు విరేచనములకు లేదు. అది శీతలము కలుగజేయునని అనేకులనుకొనెదరుగాని అది యే హానియు చేయనేరదు. పచ్చి ఆముదముగాని వంటాముదముగాని సుమారు మూడు తులములు పెద్ద వారికిని ఒక తులము పిల్లలకును ఇవ్వవచ్చును. కొంచెము వేడి కాఫీతో కలిపి యిచ్చిన మరీ మంచిది. ఆముదము సరిపడనివారికి కొంచెము సెన్నాముఖి కషాయ మివ్వ వచ్చును. రెండు మూడు విరేచనములైన తరువాత సాధారణముగా జ్వరముయొక్క ఉద్రేకము తగ్గి పోవును. తలనొప్పికి శొంఠిగంధము పట్టువేయవలెను. కలికముమాత్రము కండ్లలో వేయకూడదు. ఎందుకనిన, కొన్ని సమయములయందు కండ్లు మూతలుపడి, కండ్లలో కురుపులు లేచి దృష్టిపోవుటకద్దు. ఈ కలికములవలన



దృష్టిపోయి గుడ్డివారై యున్న పిల్లలనేకులను మనము చూచుచున్నాము. తలభార మధికముగా నున్నయెడల పొంగుచున్న నీళ్లొక పళ్ళెములో పోసి పాదములు ఆ నీళ్లలో కొంచెము కాల ముంచవలెను. వెంటనే కాళ్లు తుడిచి బట్టకప్పి పరుండబెట్టవలెను. కొంచె ఆవిరిపీల్చిన పడిసెపు భారము తగ్గును. పొంగుచున్న నీళ్లమీద కొంచెము యూకలిప్టస్ నూనె (Eucalyptus oil) కొన్ని చుక్కలు పోసి ముసుకు వేసికొని ఆ యావిరిని పీల్చిన యెడల దాని గుణము త్వరలో కనబడును. దగ్గుబాధ ఉన్నచో రొమ్మును వేడినీళ్లతో కాచి కొంచెము కర్పూరపునూనె రాయవలెను. మిరియాలు శొంఠి కలిపి కషాయముకాచి దినమునకు మూడు నాలుగు తడవలు రెండు గరిటెలనిండ ఇచ్చిన జ్వరము తగ్గును. విషజ్వరములున్నపుడు ప్రతిమనిషి, రోగి సహితము దినదినము కొంచెము ఉప్పుకలిపిన నీరు ముక్కులలోకి పీల్చి నోటిద్వారా ఉమ్మి వేసిన విషాంకురములు ముక్కులోనుండియు నోటిలో నుండియు బైటికి తీసివేయబడును. సుమారు ఒక గిద్దెడు గోరువెచ్చని నీటిలో ఒక పావలాయెత్తు తెల్ల ఉప్పు కలిపి

ఒక ముక్కు రంధ్రము మూసికొని మరియొక ముక్కు రంధ్రముద్వారా అరచేతిలోనుండి ఉప్పునీరును పీల్చవలెను. రోజుకు రెండు తడవలిట్లు చేసిన దగ్గు, జలుబు, తలభారము తగ్గును. చెమటతో కూడివచ్చిన చలిజ్వరమునకు సిద్ధౌషధము క్వైనామందు. పది చిన్నముల యెత్తు టపాలా కచ్చేరియందు విక్రయింపబడును. ప్రతి దినము ఒకటి లేక రెండు పొట్లములు పుచ్చుకొనిన జ్వరము, చలి, త్వరలో తగ్గిపోవును. ఈ క్వైనా పొడుము కొంచెము నిమ్మపండు రసముతో కలిపి పుచ్చుకొనిన ఏ విధమైన వికారము కలుగదు.

తలభారమునకు ఒక పాత్రలో చల్లటి నీళ్లు పోసి దానిలో కొంచెము చిరకా కలిపి, ఒక గుడ్డ సేలికను ముంచి, తలమీదవేసి తరుచుగా ఆ గుడ్డలు తడుపుచుండిన బాధ తగ్గిపోవును.

ఆహారమిచ్చు విషయములో జాగ్రతగా నుండవలెను. లంకణములు ఎంతమాత్రమును పనికిరాదు. జ్వరము శరీరమును దహించుచుండునుగాన కొంచెము ఆహారము అత్యవసరము. జ్వరముచేత పడియున్నపుడు



ఒక పూట ఆహారము లేకపోయినను పరువాలేదుగాని దీర్ఘలంకణమువలన అనేకులకు మరణము సంభవించును. గనుక తగు ఆహారము జ్వరములో నివ్వవలెను. అన్నములో వాతగుణమున్నది గాన అది పనికిరాదు. వేడి నీళ్లు చెరిసగము కలిపి పాలియ్యవచ్చును. సగ్గుబియ్యపు జావ, గోధుమనూక జావ, మూడు గంటల కొక తడవ ఒక గిద్దెడియ్యవచ్చును. దాహముగా నున్నపుడు చల్లని మంచినీళ్లుగాని లేక మజ్జిగ తేటగాని ఇచ్చిన యెడల దాహము తీరును. జ్వరమున్నపుడు వేడినీరు గాని లేక దానిలో కొంచెము నిమ్మపండు రసము పిండి గాని త్రాగించినయెడల చెమటపట్టి జ్వరము తగ్గిపోవును. తినుట కాహార మివ్వకూడదు గాని త్రాగుటకు జావ మొదలగునవి యిచ్చి దాహమును ఆకలిని తీర్చవలయును. అట్లు చేయనియెడల శరీరము కృశించిపోవును. మూడు దినములలో జ్వరము తగ్గిపోనిచో తెలిసిన వైద్యుని పిలిపించి రోగికి చికిత్స చేయించవలయును.

ఒక యూరిలో నొక ప్రధాని కుమారుడు రోగియై యుండెను. యేసు తన ప్రాంత్యమునకు వచ్చినాడని

అతడు విని ఆయనయొద్దకు వెళ్లి, స్వామీ! నా కుమారుడు చావ సిద్ధమైయున్నాడు గనుక నీవు వచ్చి వానిని స్వస్థపరచుదువు రా అని ఆయనను వేడుకొనుచున్నాడు. అందుకు యేసు అతనితో నీవు వెళ్లు, నీ కుమారుడు బ్రతుకుతాడని చెప్పగా అతడు యేసు తనతో చెప్పినమాట నమ్మి వెళ్లిపోయినాడు. అతడింకా వెళ్లుచుండగానే అతని దాసులు అతని కెదురుగా వచ్చి, అతని కుమారుడు బ్రతికియున్నాడని తెలియజేసిరి. ఏ గంటకు వాడు బాగుపడసాగెనని అతడు వారి నడిగినప్పుడు వారు నిన్న ఒంటి గంటకు జ్వరము వానిని విడిచినదని చెప్పగా నీ కుమారుడు బ్రతుకుతాడని యేసు తనతో చెప్పినది ఆ గంటలోనే అని అతడు తెలిసికొని తన యింటివారందరితో కూడ యేసును నమ్మెను.




C. L. S. PRESS, MADRAS—1929

# VILLAGE SERIES

## TELUGU

| | A | P |
|---|---|---|
| **No. 1. The Story of Blind Bartimaeus.** గుడ్డి బర్తిమయి కథ. 12 pp. .. .. | 0 | 1 |
| **No. 2. Plague.** ప్లేగు జాడ్యము. 24 pp. .. | 0 | 2 |
| **No. 3. Four Fine Fellows.** నలుగురు బాలశిక్షావాణుల చరిత్ర. 20 pp. .. .. | 0 | 2 |
| **No. 4. The Life of Christopher.** క్రిస్టొఫరు చరిత్రము. 24 pp. .. .. .. | 0 | 2 |
| **No. 5. Cancerous Growths.** కొరుకుడు పుండ్లను గూర్చి. 16 pp. .. .. .. | 0 | 1 |
| **No. 6. Sore Eyes.** కండ్లు కుట్టుటను గురించి. 16 pp. | 0 | 1 |
| **No. 7. The Advantages of Education.** విద్యవలన కలుగు లాభములు. 23 pp. .. | 0 | 2 |
| **No. 8. The Shepherd Boy who Killed the Giant.** రాక్షసుని చంపిన గొల్లపిల్లవాని కథ. 16 pp. | 0 | 1 |
| **No. 9. Our Enemy the Mosquito.** దోమలు. 16 pp. .. .. .. .. | 0 | 3 |
| „ **School Edition, Revised** .. | 1 | 0 |
| **No. 10. Sanitation.** పారిశుద్ధ్యము. 12 pp. ... | 0 | 1 |
| **No. 11. Fever.** జ్వరము. 8 pp. .. ... | 0 | 1 |
| **No. 12. The Forty Martyrs of Sebaste.** సెబస్తె అను పట్టణములోని నలువదిమంది హతసాక్షులు. 16 pp. ... ... ... ... | 0 | 1 |

## VILLAGE SERIES—*(Continued)*

**No. 13. Flies.** మనలను విడువని చుట్టాలు. 12 pp.

**No. 14. Sugunamma's Advice.** సుగుణమ్మ సుబోధ. 16 pp. .. .. .. 0

**No. 15. Guinea Worm.** నారికురుపులను గురించి. 12 pp. .. .. .. ..

**No. 16. Tuberculosis.** క్షయరోగము. 12 pp.

**No. 17. What do you buy at the Drink-Shop.** కల్లంగడిలో ఏమి తీసికొంటారు? 16 pp.

**No. 18. Family Hygiene.** కుటుంబ ఆరోగ్యము. 12 pp. .. .. .. .. 0

**No. 19. Naaman's Slave Girl.** సుందరమ్మ సేవ. 18 pp. .. .. .. 0

**No. 20. The Lepers' Friend.** కుష్ఠరోగుల మిత్రుడు. 16 pp. .. .. .. 0

**No. 21. Feeding the Five thousand.** అయిదు వేలమంది జనుల కాహారము పెట్టుట. *In the press.*

**No. 22. The Opium Habit.** నల్లమందు పీడ. *In the press* .. .. ..

**No. 23. The Twin Thieves.** భయంకరమైన కవల దొంగలు. *In the press* .. ..

**No. 24. Leprosy.** కుష్ఠ రోగము .. ..

**No. 25. Cholera.** కలరా .. .. 0

---

THE CHRISTIAN LITERATURE SOCIETY FOR 'NDI
POST BOX 501, PARK TOWN, MADRAS

